# ఓంకారము - శివలింగము



శాస్త్రి

గ్గసరావుగారు

గ్రంథకర్త:— ముదిగొండ మల్లికార్జునరాం

ధనదాత:

మ. రా. శ్రీ జూలూరు వెంకటేశంగుప్తగారు



ప్రకాశకులు:

శ్రీ సనాతనధర్మమహాసభ, శికింద్రాబాదు.

1945

ఓమ్

# ఓంకారము - శివలింగము

శ్రీ వేమాసింహా శాంభవ్ గారు "శివ నిర్మాల్య రత్నాకరము" అను గ్రంథ పీఠికలో, ఫ్రెంచి దేశస్థుడగు లూయీస్ గారి గ్రంథముల ననుసరించి అత్యంత ప్రాచీన కాలమునందు విదేశములలో కూడ శివ లింగపూజన మొనర్పబడు చుండెడిదని వ్రాసియున్నారు.

వా రిట్లు వ్రాయుచున్నారు "ఉత్తర ఆఫ్రికాఖండమందలి ఈజిప్టు ప్రాంతములో 'మేఫిస్' 'అషీరిస్' అను స్థలములయందు నందివాహనారూఢుడును, త్రిశూలహస్తుడును, వ్యాఘ్ర చర్మాంబర ధారియు నగు శివుని విగ్రహములు ఉన్నవి. వానిని అక్కడి ప్రజలు మారేడు ఆకులతో పూజింపుచున్నారు. పాలతో అభిషేక మొనర్చు చున్నారు. టర్కీ దేశమందలి "బాబిలోన్" పట్టణమునందు 1200 అడుగుల ఎత్తుగల శివలింగమున్నది. ప్రపంచమందెచ్చటను ఇంతటి పెద్దలింగము లేదు. హైడ్రోపోలిస్ అను నగరమందు 300 అడుగుల ఎత్తుగల లింగమున్నది. మసల్మానుల యాత్రాస్థలమైన మక్కా పట్టణమునందు 'మక్కేశ్వర' శివలింగమున్నది. దానిని వారు ఖర్జూరపత్రములతో పూజించెదరు. అమెరికా ఖండమందలి బ్రెజిల్ దేశమునందు చాలశివలింగములున్నవి. యూరప్‌లోని "కారింథ్" అనుపట్టణమున పార్వతీ దేవాలయమున్నది. ఇటలీలో అనేకమంది క్రైస్తవమతస్థులు ఇష్ట

టికిని శివలింగ పూజన మొనర్చుచునే యున్నారు. స్కాట్లండ్ (గ్లాస్గో) లో ఒక సువర్ణాచ్ఛాదితమైన శివ లింగమున్నది. ప్రజలు దానిని చాలభక్తితో పూజించెదరు. స్విజయర్ లోని ఎటిన్ (నినివా) అనెడు పట్టణములో "ఎమీర్" అనెడు శివలింగమున్నది. యహూదీయుల దేశములో వేలకొలది శివ లింగము లున్నవి. ఆఫగనిస్థాన్, చిత్రాల, కాబుల్, బల్ఖ బుఖారా మొదలగుచోట్ల శివ లింగము లున్నవి. అక్కడి ప్రజలు వానిని "పంచషేర్" "పంచవీర్" అను పేర్లతో పిలుచుచుందురు.

పండిత కాశీనాథశాస్త్రి (మైసూరు) గారు ఇట్లు వ్రాయుచున్నారు. ఫ్రెంచి రాజ్యాధీనమైన అనాం(Annam) దేశమునందు చాల శివాలయములున్నవి. ఇది ఇండోచైనా యందున్నది. దీనినే ప్రాచీన కాలమునందు "చంపా" అని పిలిచెడివారు.

సుప్రసిద్ధ పరిశోధకుడగు మిస్టర్. ఎ. బర్గేన్ (A. Bergaingne) గారు వ్రాసిన శివాలయములలోని శిలా శాసనములకు సంబంధించిన ఒక పుస్తకములోను, R.C. ముజుందారుగారి 'Ancient Indian Colonies in the Far East" అనుపుస్తకమునందును, అక్కడ చాల శిలాశాసనములు శివాలయములకు సంబంధించినవి దొరికినట్లు వ్రాయబడియున్నది. వీటిలోని సంస్కృత భాష చాల అందముగను, ప్రతిశాసనమునకు మొదట "ఓం నమశ్శివాయ" అని వ్రాయబడియును ఉన్నది.

డాక్టర్ ప్రాణనాథ విద్యాలంకార్ గారు ది.1-5-33 న కాశీనాగరీ ప్రచారిణీసభా వార్షికోత్సవ సందర్భమునందు. హిందూ దేశములో నేటికి 15000 సంవత్సరములకు పూర్వమే శివలింగపూజ ఉండెడిదని అనేక ప్రమాణములతో రుజువు చేసినారు.

శ్రీ సునీతి కుమారచటర్జీ M.A, D.Lit. గారు వ్రాయుచున్నారు "ఒకానొకప్పుడు 'అసాం' దేశమందలి 'మిహిర్ ఖేడా' అనుపట్టణము కాశీకన్నను మించిన శివక్షేత్రముగ నుండెడిది."

మిహిర్ గ్రామములో దొరికిన 4 వ శిలాశాసనము ననుసరించి భద్రేశ్వర శివలింగస్థాపన నేటికి 1400 సంవత్సరములకు పూర్వమే జరిగినట్లు తెలియుచున్నది. అందులోని ముఖ్య శ్లోకము—

శ్లో॥ స్వప్నం యేన త్రితయ సుభగం భాగ్యనాశః స్వః స్వలోకా
యేన స్థానం భవనదురితం నష్టనివాంధకారం
యస్యార్చిం త్యా జగతిసుమహా యస్యనాదిర్న చాంతో
స్పృ... దేశే జనయతు సుఖం శంభుభద్రేశ్వరోయం

శ్రీ శంభభద్రేశ్వర లింగము 'ఉమా' అను పర్వతము మీద స్థాపింపబడినట్లు తెలిపిన శాసనముద్వారా తెలియుచున్నది. గ్రంథ విస్తరభీతిచేత ఆ శ్లోకముల నన్నింటిని ఇచట వ్రాయుట లేదు.

మ్యాస్పెరో అనెడి ఫ్రెంచి విద్వాంసునివలన నింకి కొన్ని విషయములు బయలుపడినవి.

బాబూ శివప్రసాదుగారు వ్రాసిన 'పృథ్వీ ప్రదక్షిణము' అను గ్రంథమునందు అనేక గొప్ప విషయములు ఉదహరింపబడియున్నవి.

29 వ శాసనమునందు నేటికి 4 లక్షల 38 వేల సంవత్సరముల క్రిందట 'ముఖలింగేశ్వర' దేవాలయము స్థాపింపబడినట్లు వ్రాయబడియున్నది. 'ట్రాక్యా' అను గ్రామమునందు ఒక శివ విగ్రహము దొరికినది. 'యూసమమ్' అను గ్రామములోను, 'డాకాలాయే' అను గ్రామములోను త్రిశూలపాణియగు శంకరవిగ్రహములు దొరికినవి. 'పోనగర్' అనుచోట 'కౌతారేశ్వరి' యను దేవీపూజ జరిగెడిది. 'డాంగ్ ఫుక్' అను చోట అర్ధనారీశ్వరమూర్తి దొరికినది. ఫ్రెంచి 'కంబోడియా' లో శా॥ సం॥ 866 లో అంకోర్ తాం అను గ్రామమునందు శివలింగ స్థాపన జరిగినట్లు వ్రాయబడియున్నది.

'జావా' 'సుమిత్రా' ద్వీపములు పూర్వకాలమునందు 'యవ' 'సువర్ణద్వీపము' లని పిలువబడెడివి. డాక్టరు N. J. క్రోమ్‌గారు వ్రాసిన (**Het oude Javaen Sijn Kunst**) అను డచ్చిభాషలోని పుస్తకమునందు అనేక చిత్రపటము లివ్వబడినవి.

జావా ద్వీపమందలి 'ప్రాంబనాక్' సమీపమునందు లారంజో గ్రాంగ్ అనెడు శివాలయమున్నది. పణాతరణ అనెడు గ్రామములో ఒక గొప్ప శివాలయమున్నది.

T. గోపీనాథరావుగారు 'Elements of Iconography Vol. II Part I అను పుస్తకమునందు గుడిమల్లము లోని ఒక ప్రాచీన శివలింగమును వర్ణించినారు.

రాడెన్ మాస్ పోర్ బట్ జరకా ( Raden Mas Poebatjaraka ) గారు ఒక గ్రంథములో మొట్టమొదట రోమన్ లిపిలో వ్రాసిన మంగళాచరణము నిచట ఉదహరింపుచున్నాము.

"ఓం అవిఘ్నమస్తు. నమఃశివాయ"

యఃసర్వస్సృజతి ప్రపాలయతి చాశేష్యం హరిష్యత్యపి
దేవానాం జగతో-పియః సుశరణో గౌరీపతిర్వ్యాహరః
తం దేవం ప్రణమామి శూలిన మచింత్యం నీలకంఠంశివం
భూ దేవేశమమ ప్రశాన్యతుమలం పాపంచ సర్వంసదా॥

కావున చారిత్రాత్మకముగ పరిశీలించిన యెడల అత్యంత ప్రాచీనకాలమునుండియును ప్రపంచమం దంతటను శివలింగ పూజనము ఆచారమునం దున్నట్లు కానిపించు చున్నది.

పండిత మాధవాచార్యశాస్త్రిగా రిట్లు వ్రాయు చున్నారు. " శివలింగపూజ జైనులకాలమునుండియో లేక వామ మార్గీయులనుండియో ప్రారంభించియుండునని నేను కొందరు అల్పజ్ఞు లనుచున్నారు. కాని నేటికి 2000 సం॥ లకు పూర్వమే శంకరాచార్యులవారు 'అథ బ్రహ్మైవ తారస్య' యని సంహారగర్జన మొనర్చియున్నారు. అందువలన, ఆయనకంటె పూర్వమే శివలింగ పూజనము బాగుగా వ్యాపించియుండెను.

ఏజువగుచున్నది. అంతియెగాక, మనుస్మృతి (అధ్యా 2) శ్లో ఇట్లు వ్రాయబడియున్నది.

నిత్యం స్నాత్వా శుచిః కుర్యా ద్దేవర్షి పితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ సమిదాధాన మేనచ॥

(ప్రతిమాదిషు హరిహరాది దేవపూజనమితి కుల్లూక భట్టః)

అనగా నిత్యమును స్నానాదికము లొనర్చి పవిత్రముగా దేవ, ఋషి, పితృతర్పణము లొనర్పవలయును. విష్ణువు,శివుడు మొదలైన దేవతా విగ్రహములను పూజింపవలయును. హవన మొనర్పవలయును.

మనువు సృష్టియొక్క ఆదికాలమునందలివాడు అగుటచే శివలింగ పూజనముకూడ సృష్టి ప్రారంభమునుండియే యుండెనని తెలియుచున్నది.

ఇతిహాస గ్రంథములనుండియును ఇటులనే తెలుసుకొనగలుగుచున్నాము. సంస్కృత సాహిత్యమునందలి ఆదికావ్యమగు వాల్మీకి రామాయణము( ఉత్తరాకాండ 31 సర్గ 42—43 శ్లో) నందు ఇట్లు వ్రాయబడియున్నది.

యత్ర యత్ర సయాతిస్మ రావణో రాక్షసేశ్వరః
జాంబూనదమయం లింగం తత్రతత్రస్మనీయతే
బాలుకావేది మధ్యేతు తల్లింగం స్థాప్యరావణః
అర్చయామాస గంధాఢ్యైః పుష్పైశ్చాగురుగంధిభిః

రాక్షసులకు రాజగు రావణుడు (దిగ్విజయ యాత్ర చేయునపుడు) ఎక్కడెక్కడికి పోయిన అక్కడికెల్లను సువర్ణ

సు యమగు లింగము నొకదానిని తీసుకొనిపోయెడివాడు. ఇసుక వేదికపై దాని నిడి గంధ పుష్పాదులతో పూజచేసెడి వాడు.

ఇటులనే శ్రీరామచంద్రుడు సహితము శివలింగపూజన మొనర్చినట్లు వాల్మీకిరామాయణము (యుద్ధకాండ సర్గ 125 శ్లో 20-21) నం దున్నది.

అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోద్విభుః
ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః

శ్రీరామచంద్రుడు సీతతో అనుచున్నాడు. 'దేవీ! ఇచట శివలింగస్థాపన మొనర్చి పూజించుటచే మాకు మహాదేవుని వరము లభించినది. అ కనుపించునదియే గొప్పదగు సాగరతీర్థమైయున్నది.'

ఇది ఇప్పటికి 864000 సం॥ క్రిందటి మాట. దీనిబట్టి అప్పటికే శివలింగపూజనము ప్రచలితమైయున్నట్లు తెలియ నగుచున్నది.

## 'శివ' శబ్దార్థము

ముక్కుమీద ఈగలు ముసురుచున్నవని ముక్కును తెగకోసుకొనునట్లు తనకు తెలియనంతమాత్రమున గంభీర సత్యసిద్ధాంతములను పరిహసించుట అవివేకము సనదే యగును. మిస్ మేయోవంటి పాపిష్ఠ హృదయ మానసంచి సంతమాత్రమున 'శివలింగతత్త్వమునకు కలుగు కొరత యేమి యును లేదు.

'శేతే 'అసౌ శివః' అనునది శివశబ్దనిర్వచనమైయున్నది. అనగా శయనించువాడు శివుడని యర్థము. మహాప్రళయా నంతరము ప్రకృతియొక్క సమస్త క్రియలును ఆగిపోయిన పుడు నిశ్చేష్ట, నిష్క్రియ, శాంత, చేతన క్రియావిశిష్టమగు బ్రహ్మమునకు శివుడని పేరు. వేదమునందు—

నమః శంభవాయచ మయోభవాయచ నమః శంకరాయచ మయస్కరాయచ నమః శివాయచ శివతరాయచ॥

(యజుర్వేద 16-41)

ఈ మంత్రమునందు స్పష్టముగా శంభు, శంకర, శివ శబ్దములద్వారా శివుడు స్తుతింపబడియున్నాడు.

ఇటులనే మాండూక్యోపనిషత్తునందుకూడ—

అదృష్ట మవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచింత్యమవ్య పదేశ్యమైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థమన్యతే స ఆత్మా విజ్ఞేయః॥

అనగా, ఇంద్రియములకు గోచరింపనివాడును, వ్యవహ రించుటకు వీలుగానివాడును, గ్రహించుటకు వీలు లేనివాడును, లక్షణములు లేనివాడును చింతించుటకును చెప్పుటకును వీలు లేనివాడును, మాయాకృత ప్రపంచాతీతుడును, సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుడును, అద్వైతమును తురీయా వస్థారూపము నగు శివుడే ఆత్మయైయున్నాడు. వానిని తెలుసుకొనవలయును.

వేదప్రతిపాదితమగు శివుని మహాత్మ్యము శివపురాణ మునందు 24000 శ్లోకములలో వివరింపబడినది. అంతేగా

గాక స్కాంద, లింగ పురాణముల యందు సహితము లక్షల కొలది శ్లోకములతో విశదీకరింపబడి యున్నది. ఉపర్యుక్త వేదప్రమాణములయందే పరబ్రహ్మము శివనామముతో స్మరింపబడినదో ఆ శివరూప బ్రహ్మమును గూర్చియే పురాణములయందు వర్ణింపబడియున్నది

నారదీయ వాయుపురాణ అనుక్రమణయందు

యో దేవః సర్వదేవానాం దుర్విజ్ఞేయః సనాతనః
సంహితేయం మహాపుణ్యా శివస్యపరమాత్మనః

అనగా, ఎవడు సర్వదేవాధిష్ఠాతయో, ఎవడు దుర్విజ్ఞేయుడును, సనాతన బ్రహ్మమునై యున్నాడో, అట్టి పరమాత్మయగు శివునియొక్క మహాపవిత్రమగు శివసంహితనై యున్నది.

ఇటులనే శివపురాణ వాయుసంహిత(అధ్యా శ్లో43)లో

తస్మాద్విముక్తి మన్విచ్ఛన్ శివమేవసమాశ్రయేత్
తమాశ్రిత్యైవ దేవానామపి ముక్తిర్నచాన్యథా॥

అనగా, ముక్తినికోరునట్టివాడు శివుని ఆశ్రయింపవలయును. దేవతలుకూడ శివుని ఆశ్రయించియే ముక్తిని పొందుచున్నారు. ముక్తికి యింతకన్న మరియొకమార్గ మేమియును లేదు.

ఇటులనే శివపురాణ అంబికాఖండము (అధ్యా 2)లో

ప్రపద్యే దేవమీశానం సర్వజ్ఞ మపరాజితం
మహాదేవం మహాత్మానం శివస్య జగతఃపతిం॥

అనగా, సర్వజ్ఞుడును, అపరాజిత సర్వజగత్పాలకుడును మహాత్ముడును, ఈశానుడును, మహాదేవుడునగు శివుని శరణు వేడుచున్నాను.

ఉపర్యుక్త వేదప్రమాణములయందు స్పష్టముగా శివ శబ్దము నిర్లేప నిరంజన బ్రహ్మమునకే ప్రయోగింపబడి యున్నది. కావున, అతడు మనవలె కర్మఫల జన్యస్థూల శరీరధారియగు మనుష్యుడుకాడు. ఒకనికి కుమారుడును, ఒకనికి తండ్రియునుకాడు.

# లింగ శబ్దార్థము

వ్యాకరణమునందు పుంలింగ, స్త్రీలింగ నపుంసక లింగాది శబ్దములు విరివిగా కాన్పించుచున్నవి. ఇచట "లింగ"మునకు మూత్రేంద్రియమని అర్థము చెప్పు అవివేకి యెవడైన యుండునా? మిస్ మేయోవంటి బుద్ధిహీనుల మాటల ననుసరించి ఇచటకూడ లింగశబ్దమునకు మూత్రేన్ద్రియమని అర్థము చెప్పినయెడల, అశ్లీలభయముచే మనబాలురు వ్యాకరణము మును పఠింపకుండవలయును. అందుచేత అనేకార్థ వాచకి మగు శబ్దమునకు ప్రయోగ బాహుల్యమును బట్టి ప్రమాణిత మగు విశుద్ధార్థమును పరిత్యజించి, యిష్టమువచ్చినట్లు అశ్లీల కల్పనల కల్పించుట జ్ఞానశూన్యుల పనియైయున్నది. ఆర్ష గ్రంథములయందు లింగశబ్దమే అర్థమున ప్రయోగింపబడి నదియు పరిశీలింపుడు.

నిష్క్రమణం ప్రవేశన మిత్యాకాశస్యలింగమ్
(వైశేషికదర్శనము 2-1-10)

అనగా, దేనియందు నిష్క్రమణము, ప్రవేశము మొదలగునవి జరుగునో అది ఆకాశముయొక్క లింగమై యున్నది. అనగా లక్షణమైయున్నది.

అపరస్మిన్నపరం యుగపచ్చిరం క్షిప్రమితి కాల
లింగాని (వైశేషికదర్శనము 2-2-6)

అనగా, వెనుక, ముందు, వెంట, ఆలస్యముగ, త్వరగా మొదలగు వ్యవహారము దేనియందు జరుగునో అది కాలముయొక్క లింగమై అనగా చిహ్నమైయున్నది.

ఇతి ఇదమితి యతస్తద్దిశ్యం లింగమ్
(వైశేషిక 2-2-10)

అనగా ఇక్కడినుండి ఇక్కడికి అను వ్యవహారము దేనియందు జరుగునో అది దిశయొక్క లింగమై అనగా లక్షణమైయున్నది.

ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖదుఃఖజ్ఞానాన్యత్మనో
మనోలింగమ్ (న్యాయదర్శనము 1-10)

అనగా, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖ దుఃఖ, జ్ఞానములుఆత్మయొక్క లింగమై అనగా లక్షణమైయున్నది.

యుగపజ్ జ్ఞానానుపపత్తిర్మనసో లింగమ్
(న్యాయదర్శనము 1-16)

అనగా, ఒక్కసమయమునందు ఒక్కసారిగా అనేక వస్తు జ్ఞానము లేకపోవుట, మనస్సుయొక్క లింగమైఅనగా లక్షణమైయున్నది.

ఉపర్యుక్త ప్రమాణములచే లింగశబ్దమునకు సంజ్ఞ, లక్షణము, చిహ్నము, గుర్తు, పరిభాష, డెఫినిషన్ అని అర్థము.

'శివ' శబ్దమనగా బ్రహ్మమనియు, 'లింగ' మనగా చిహ్నమనియు తెలిపియుంటిమి. అందుచేతనే పరబ్రహ్మము యొక్క చిహ్నభూతమగు ప్రతిమను ఆరాధించుట ఆస్తికుల కందరకును పరమకర్తవ్యమైయున్నది. ఇట్టి రహస్యార్థయు సిద్ధాంతముల నెరుంగజాలక వెర్రివెంగళప్పలవలె అధిక్షేపించుట విజ్ఞుల పనిగాదు. ఒక గ్రామమందొక మౌల్వీగా రుండిరి. ఆయన పిల్లకాయలకు చదువు చెప్పుచుండెడివారు. కాని అతడు జన్మాంధుడు పండుగ రోజులలో పిల్లలందరును గారెలు, బూరెలు, లడ్డూలు, హాల్వా మొదలగు మిఠాయీలను తెచ్చి పంతులుగారి కిచ్చెడివారు. ఒకరోజు ఒక హిందూబాలుడు పాయసమును ఒక గిన్నెలో పోసికొని తీసికొనివచ్చెను. ఆ మౌల్వీగారు పాయస మన్నపేరుకూడా అంతకు క్రితము వినియుండకపోవుటచే 'పాయస మెట్లుండును?' నని ఆ బాలుని ప్రశ్నించెను. 'పాయసము తెల్లగా ఉండును.' అని బాలుడు జవాబిచ్చెను. 'తెలుపు ఎట్లుండును?' అని ఆ జన్మాంధుడగు మౌల్వీగారు ప్రశ్నించిరి. 'కొంగవలె ఉండును.' అని బాలుడనెను. కొంగ ఎట్లుండునని మౌల్వీగా రడిగిరి. బాలుడు తన చేతినివంచి, పొడుగుగా కొంగమెడ వలెనుంచి "ఇదిగో యిట్లుండును" అనెను. మౌల్వీగారు నెమ్మదిగా తన చేతితో తడివిచూచి "అబ్బో! చాల వంకర

రగా నున్నదే ! యిటువంటి దానిని తినజాలనని'' చెప్పెను. ఎవరు ఎన్ని విధముల బోధించినను పాయసమును తిన డాయెను. వంకరగా నున్నదనెడు భ్రమచేత తన జీవితములో పాయసమువంటి స్వాదిష్టమగు పదార్థమును భుజింపడాయెను. అటులనే మూత్రేంద్రియ భ్రాంతితో శివలింగపూజనుండి విముఖులగు వారి నేమననలయునో తెలియుచున్నది. ఇట్టి మహానుభావుల నుద్దేశించియే భర్తృహరి ''మూర్ఖస్యనాస్త్యౌషధం'' అని చక్కగా చెప్పినాడు.

## 'భగ' శబ్దార్థము

శివలింగమువలెనే పానువట్టమును చూచి, దానిని పార్వతియొక్క యోనియని నాస్తికులగువారు అధిక్షేపించుచున్నారు. భగ శబ్దమునకు మూత్రేన్ద్రియమని అర్థము చెప్పుకొని యిట్లు పొరబడుచున్నారు. నిజముగా, వేదాదిసచ్ఛాస్త్రములయందు 'భగ' శబ్దము ప్రసంగానుసారముగా మాయ, ప్రకృతి, ఐశ్వర్యము, కారణము మొదలగు అర్థములయందు ప్రయోగింపబడినది.

ప్రాతర్జితం భగముగ్రం హవామహే

(అథర్వ 3-16,2)

అనగా, మేము ప్రాతఃకాలమునందు ఐశ్వర్యాధిష్ఠాతయగు దేవుని స్తుతింపుచున్నాము, అని అర్థము. ఇచట భగ మనగా ఐశ్వర్యము. అందుచేతనే భగవాన్ (భగ + వాన్ = భగవాన్) అనగా ఐశ్వర్య విశిష్టుడగు దేవుడని యర్థము.

తస్యయోనిం పరిపశ్యన్తిధీరాః

(యజు 31-19)

అనగా, ఆ పరమాత్మయొక్క యోనిని - మూలకారణమును లేక ప్రకృతిమాయను ధీరులగు పురుషులు మాత్రమే యదార్థరూపమున తెలుసుకొనగలుగుచున్నారు.

# శివపురాణములోని నిర్వచనము

పురాణములయందు, భగ, లింగశబ్దములు ఏయే అర్థములయందు ప్రయోగింపబడినవో ఆ విషయమును స్వయముగా వేదవ్యాసుడే నిర్ణయించి యున్నాడు. ప్రతి శాస్త్రమునందును కొన్ని పారిభాషిక పదములుండును. అవి తమ వ్యాపకార్థమునందు గాక ఒకానొక విశిష్టనియమితార్థమునందే ప్రయోగింపబడును. వ్యాకరణమునందు ప్రత్యాహార ఘి. టి. ఆగమ, ఆదేశాది శబ్దములు వచ్చుచుండును. వానికొక నియమితమగు అర్థము నిర్ణయింపబడియున్నది. అటులనే పురాణములయందు "లింగ" "భగ" శబ్దములకుకూడా నిర్ణీతమగు అర్థమున్నది.

లీనార్థగమకం చిహ్నం లింగ మిత్యభిధీయతే
భం వృద్ధింగచ్ఛతీత్యర్థా ద్భగః ప్రకృతి రుచ్యతే
ముఖ్యోభగస్తు ప్రకృతి ర్భగవాన్ శివ ఉచ్యతే
(శివపురాణ విద్యేశ్వరీ సంహిత 16-106)

అనగా, లీన - అవ్యక్తావస్థాపన్న వస్తువుయొక్క, గమక=కలుపునట్టి చిహ్నమునకు (లీన + గ) లింగమనిపేరు.

అందుచేత ప్రకృతియొక్క ముఖ్యనామము భగమును, భగాధిష్ఠాతయగు శివుడు భగవానుడునై యున్నది.

## ఆకార నిరూపణ

శివలింగముయొక్క ⬯ అండాకార స్వరూపమును,

పానుపట్టముయొక్క 3 ఉకారమువంటి ఆకారమును

చూచి నాస్తికులగువారు తమ భ్రష్టబుద్ధి ననుసరించి అశ్లీలమగు స్త్రీ పురుష జనేంద్రియముల నూహించి భ్రాంతులగుచున్నారు. మిస్ మేయో, ఆమె అనుచరులగు మరికొందరు మూర్ఖులను మినహాయించినయెడల, శివలింగపూజ నొనర్చు ఏ హిందువుని హృదయమునందును అట్టి నీచభావము లేదు. మీరు ఏ పల్లెటూరికైనను పోయి, విద్యావిహీనుడైనప్పటికినీ శివలింగపూజన మొనర్చునట్టి యే మనుష్యుడైనను 'శివాలయమునం దెవరివిగ్రహమున్నది?' యని ప్రశ్నింపుడు వాడు వెంటనే "త్రిలోకాధిపతియగు శివునిప్రతిమఉన్నది. నేను దానిని పూజింపుచున్నాను." అని జవాబొసంగును.

బాహ్య ఆకారమునే ఆధారముగా తీసికొని యిష్టము వచ్చినట్లు అఘటిత కల్పనల ఘటింప దలంచినయెడల ప్రపంచమునందలి ప్రతి వస్తువునందును అశ్లీలతను చూపింప వచ్చును. శివలింగమును మూత్రేంద్రియమని పరిహసించు

ఆర్యసమాజీకుల సంస్కారవిధిలోని యజ్ఞపాత్రయందలి ప్రోక్షణి, పురోడాశపాత్రి మొదలగు వాని బాహ్య ఆకారమును స్త్రీపురుష మూత్రేంద్రియములవలె ఉన్నదని పరిహసింపవచ్చును. ఇట్టి కల్పనలన్నియు హాస్యాస్పదములు. పూర్వమొకసారి వర్షాకాలమునందు నదులన్నియు పొంగి వరదలు పారెను. అనేక గ్రామములకు గ్రామములే కొట్టుకొనిపోయెను. ఎచటనుండియో ఒక నూనె గానుగ నదిలో కొట్టుకొనివచ్చి ఒక పల్లెటూరివద్ద ఆగిపోయెను. వరదలు తగ్గిపోయిన పిదప గ్రామప్రజలందరును దానిని గుంపులు గుంపులుగా చూడవచ్చిరి. వారు అంతకుపూర్వము ఎన్నడును గానుగను చూచిగాని, వినిగాని యుండలేదు. అందుచేత ఆ వస్తువేమో వారికెవరికిని అర్థముకాక ఆ గ్రామమందలి అవివేక శిరోమణిగారి వద్దకువచ్చి ఆయనను తీసికొనిపోయి దానిని చూపించిరి. ఆ మూర్ఖుడు తన అల్పజ్ఞత్వమును కప్పిపుచ్చుకొని, " ఓహో! ఇదియా? ఇది దేవునియొక్క కాటుకభరిణయై యున్నది. ఆకాశమునుండి క్రిందపడినది. ఇట్టి విషయములను నావంటి విద్వాంసులుతప్ప యితరులెరుంగజాల" రని చెప్పెను. ఆమూర్ఖప్రజలందరునూ అతని మాటలను సత్యమని నమ్మిరి. అటులనే శివలింగము, పానువట్టముయొక్క బాహ్య ఆకారమును చూచి ఎవడో మూత్రేంద్రియమని చెప్పుటయును, వీరు దాని ననుసరించుటయును లజ్జాజనకముగ నున్నది.

# శివలింగోత్పత్తి

వాస్తవముగా శివలింగ మేమి? యను విషయము శివ పురాణమందలి శివలింగోత్పత్తి ఘట్టమును పరిశీలించిన యెడల తెలియగలదు. అందలి కొన్ని అంశములను [illegible] ఉదహరించుచున్నాము.

స్థూలదృశ్యం యదానాసీ త్సదసదాత్మకం చయత్
తదా బ్రహ్మమయం తేజోవ్యాప్తిరూపంచ సంతతమ్ 15
నస్థూలం నచసూక్ష్మం చశీతం నోష్ణంతు పుత్రక
ఆద్యంతరహితం దివ్యం సత్యం జ్ఞానమనంతకమ్ 16
యోగినో౽న్తరదృష్ట్యా హియద్ ధ్యాయంతినిరంతరమ్
తద్రూపం సకలంహ్యాసోజ్ జ్ఞానవిజ్ఞానదం మహత్ 17
కియతాచ్చైవ కాలేన తస్యేచ్ఛా సముపద్యత
ప్రకృతిర్నామ సా ప్రోక్తా మూలకారణమిత్యత. 18
జ్యోతిర్లింగం తదోత్పన్నం మావయోర్మధ్య అద్భుతమ్
జ్వాలామాలా సహస్రాఢ్యం కాలానలచయోపమం 63
క్షయవృద్ధి వినిర్ముక్తమాది మధ్యాంత వర్జితమ్
అనౌపమ్య మనిర్దిష్ట మవ్యక్తం విశ్వసంభవమ్. 64

(శివపురాణ ధర్మసంహిత అధ్యా 2 శ్లో. 15-64)

అనగా, "ఈ స్థూలదృశ్య జగత్తు ఉత్పన్నమై యుండనపుడు, ఆ మహా ప్రళయాంత సమయమున, సత్ అసత్ ఏదియును లేనపుడు (ఉన్నదియు లేనిదియు చెప్పుటకు వీలుగా

నప్పుడు) నిరంతర వ్యాప్తి రూపబ్రహ్మము తేజము ప్రకటమాయెను. 15

(బ్రహ్మ తన పుత్రుడగు నారదునితో అనుచున్నాడు.) హే పుత్రకా! ఆ బ్రహ్మ తేజమునందు స్థూలసూక్ష్మ శీతోష్ణములలో నేదియు లేదు. ఆది, అంతము లేదు. ఆ అలౌకిక దివ్య తేజము సత్యమును, జ్ఞానస్వరూపమును, అనంతమున్నై యుండెను. 16

యోగీశ్వరులు సమాధియందు నిరంతరమును ఆ తేజమును దివ్యదృష్టిచే ధ్యానింపు చున్నారు. జ్ఞాన విజ్ఞానప్రదమగు ఆ బ్రహ్మ తేజము కాన్పించెను. 17

కొంతకాలము తర్వాత ఆ బ్రహ్మ తేజమునందు ఇచ్ఛాక్రియ (motion) ప్రకట మాయెను. అదియే చరాచరములకు మూలకారణమగు ప్రకృతియై యున్నది. 18

అప్పుడు మా యిరువుర (బ్రహ్మ విష్ణు) మధ్యను ఆశ్చర్యజనకమగు జ్యోతిర్లింగముఉద్భవించెను. అది జ్వాజ్వల్యమాన తేజోమయ పరిధితో ప్రళయాగ్నివలె నుండెను. 63

తగ్గుట లేదు, పెరుగుట లేదు. ఆది లేదు, అంతము లేదు. ప్రపంచమునందు దానికి ఉపమాన మేమియును లేదు. దానిని వర్ణింప జాలము. అది అవ్యక్తమును, విశ్వమునకు ఉత్పత్తిస్థానమునై యున్నది. 64

# వేద సమర్థనము

నా సదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజోనో
వ్యోమా పరోయత్ (ఋగ్వే. 8-7.7. 1)
సర్వేనిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి,
నైన మూర్ధ్వం నతిర్యంచం నమధ్యే పరిజగ్రభత్

(యజుర్వేద. 32-2)

అనగా, సత్ అసత్ స్థూలసూక్ష్మ ద్యావాభూమి ఏమియును లేని ఒకానొక సమయముండెను. తరువాత విద్యుత్ పురుషుడు—జ్యోతిర్లింగము ఉత్పన్న మాయెను. దానిచే సమస్త చరాచరములును ఉద్భవించెను. ఈ జ్యోతి ర్లింగముయొక్క చివర, చుట్టుప్రక్కలు, క్రింద ఎవరును పొంద లేదు." అని అర్థము.

ఇదే విషయము మనుస్మృతియందును వ్రాయబడి యున్నది.

తదండమభవద్ధైమం సహస్రాంశు సమప్రభమ్

(మను. 1-9)

అనగా సృష్టియొక్క ఆరంభమునందు ఒక అండము ఉత్పన్నమయ్యెను. అది వేలకొలది సూర్యులవలె ప్రకాశి వంతమై యుండెను.

ఉపర్యుక్త వేదస్మృతి పురాణశాస్త్ర ప్రమాణము లవే, సృష్టియొక్క ఆరంభమునందు నిరాకార బ్రహ్మసాకార

రూపముగ పరిణమించెననియు, అదియే జ్యోతిర్లింగ స్వరూపమనియు రుజువగుచున్నది. ఈ జ్యోతిర్లింగమే బ్రహ్మాండమని పిలువబడుచున్నది. ఈ బ్రహ్మాండముయొక్క అండాకారమును, అనగా బ్రహ్మముయొక్క ప్రతిరూపము, "శివలింగ"మను పేరుతో నేడు మనము పూజించుచున్నాము. దీని తాత్పర్యమేమనగా, నిరాకార బ్రహ్మముయొక్క సృష్టి ఉత్పత్తి సమయమందలి మొట్టమొదటి రూపమును అర్చకులు ఉపాసన మొనర్చుచున్నారు. శివపురాణమునందు విద్యేశ్వరీ సంహిత (107) లో

శివశక్త్యోశ్చ చిహ్నస్య మేలనం లింగముచ్యతే

అనగా, శివ=బ్రహ్మ, శక్తి=మాయ, యొక్క చిహ్నముల కూడికయే శివలింగము.

సృష్టి ప్రారంభ మందలి జ్యోతిర్లింగోత్పత్తినిగురించి మన పురాణములయందు వ్రాయబడియున్న విధముగనే నేటి సైంటిస్టులుకూడా సృష్టి క్రమమును వ్రాయుచున్నారు.

## ఓంకారము - శివలింగము

సమస్త వేదబీజమగు "ఓం"కారమే శివలింగ [illegible] రూపమై యున్నది. వేదాది శాస్త్రములయందు [illegible] ఓంకార స్వరూపమును, మహిమయును [illegible] శివలింగమునందు ఘటిల్లుచున్నవి.

ఓం ఇత్యేత దక్షరముద్ గీథముపాసీత
(ఛాందోగ్య-1)

అనగా, ఓం- అను ఒక్క అక్షరమే గానమొనర్చుటకును, ఉపాసన మొనర్చుటకును తగియున్నది.

ఓం ఖం బ్రహ్మ (యజు 40-47)

అనగా, ఈ సమస్త చరాచరమును బ్రహ్మమై యున్నది.

ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ (గీత 8-13)

అనగా "ఓం" అను ఒక్క అక్షరమే బ్రహ్మమై యున్నది.

ఓమిత్యే దక్షరమిదగ్ం ఓం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్
(మాండూక్య. 1)

అనగా "ఓం" ఇది ఒక అక్షర సర్వస్వమై యున్నది.

సమస్తవేదములును దీనియొక్క వ్యాఖ్యమైయున్నవి. సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణిచయద్వదన్తి యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యో మిత్యేతత్. (కఠ 1-15)

అనగా, సమస్తవేదములును ఏ సర్వోచ్ఛ పదమును వర్ణింపుచున్నవో, దేని కొరకు సమస్త తపములును చేయ బడుచున్నవో, దేని కొరకు బ్రహ్మచర్యాది వ్రతధారణము లాచరింపబడుచున్నవో, ఆ పదమును సంక్షేపముగా చెప్ప వలయునసిన యెడల, "ఓం" అను ఒక అక్షరమైయున్నది.

త దేవలింగం ప్రథమం ప్రణవం సార్వకామికమ్
(శివపురాణ విద్యేశ్వర సంహిత 17-37)

అనగా సర్వకామ్య ప్రదాతయగు ప్రణవమే ఓం కారమే మొట్టమొదటి లింగమై యుండెను.

ఉపర్యుక్త ప్రమాణములచే, బ్రహ్మ స్వరూపమగు ఓంకారమే శివలింగమని స్పష్టముగ తెలియుచున్నది.

వేదమునందు "తద్దూరే తదంతికే॥ యని, బ్రహ్మము మలవిక్షేప ఆవరణముల కారణమున మనలనుండి చాల దూరమునందును, సర్వవ్యాపకుడగుటచే మనకు అత్యంత సమీపమునందును, ఉన్నాడు. ఈ వాఙ్మనస అగోచరమగు ఆ పరబ్రహ్మ జ్ఞానమును పొందుటకొరకె సాంకేతికములయొక్క ఆవశ్యకత కలుగుచున్నది. మన కన్నులకగపడని కాంతిని మనము చూడవలయుననిన యెడల ఒక అద్దమును ముందుగా కొనవలసి యుండును. అటులనే హృదయస్థుడగు శివుని చూడవలయుననిన యెడల వాని, చిహ్నభూత సాంకేతిక మగు ఓంకారమును, లేక, శివలింగమును ముందుగా పొంద వలసి యున్నది.

శుక్లపక్ష విదియనాటి చంద్రుడు ఆకాశమునందున్న పుడు మన మందరమును దర్శన మొనర్చుకొనుచున్నామను కొనుడు. అపుడొక చిన్నబాలుడు చంద్రదర్శనలాలసచే అన్ని దిక్కులను చూచుచుండెనే కాని చంద్రుడు మాత్రము కాన్పింపలేదు. "అదిగో, అక్కడ, అదిగో అక్కడ" అని

ఎన్నిసారులు చెప్పినను వానిదృష్టి చంద్రుని కనుగొనజాలక పోయెను. అప్పుడొక బుద్ధిమంతుడువచ్చి చంద్రునికి సమాన సూత్రమునందున్న ఒక వృక్షమునో, లేక మేడనో చూపించి దాని శిఖరమున వాని దృష్టిని నిలుపునట్లు చేసి తదుపరి దాని పైభాగమందలి చంద్రుని చూపించును. చంద్రుడు ఆ వృక్షమునకును, మేడకును, చాల దూరమునందున్నను, అస్థిరముగు దృష్టిని ఒకచోట కేంద్రీకృత మొనర్చుటకు ఇంతకన్న ఉపాయసాధన మేమియును లేదు.

అందుచేత ఒక దూరస్థ పదార్థమును ప్రత్యక్షమొనర్చుటకును, అవ్యక్తమును వ్యక్త మొనర్చుటకును ఏదియేని ఒక సంకేతము అనివార్యమని తెలియవలయును. గంట "గణ గణ" మ్రోగుచున్నదనియు, మద్దెల "ధిమ ధిమ" మ్రోగుచున్నదనియు చెప్పుదుము. గంటనుండి "గ" "ణ" అను వర్ణములుగాని, మద్దెలనుండి 'ధి' 'మ' అను వర్ణములు గాని వెలువడుట లేదు. కాని, ఆధ్వనిని ఇతరులకు తెలియబర్చుట కింతకన్న మరియొక మార్గ మేమియును లేదు.

గణితశాస్త్రమునందు గుండ్రని అండాకార చిహ్నము నను 0 శూన్యమనియు, బిందువనియు, సైఫరనియు, జీరో అనియు చెప్పుదురు. బ్రహ్మము నిర్లేపమును నిరంజనమును, గుణాతీతమును, సర్వమునై యుండియు ఏమియును కానట్టిది యునై యున్నది. అట్టులనే బ్రహ్మ చిహ్నమగు 0 బిందువు నందును తరుగుట, పెరుగుట, విభక్తమగుట, మొదలైనగుణ

ము లేవియును లేక ఎప్పుడును ఒకేవిధమున ఉండును. తనకు స్వయముగా విలువయేమియును లేక పోయినను, మూలసం రూపములగు (ఒకటినుండి 9 వరకు) అంకెలతో కలిసి ఉన్న రోత్తరము దశగుణాధిక మొనర్చుచున్నది. సామాన్యముగా ప్రపంచమందలి అన్ని లిపులయందును శూన్యమును అండా కార 0 చిహ్నముతోనే వ్రాయుచున్నారు. ఇట్టి పరమ రహస్యమును తెలియజాలని మిస్ మేయో వంటి అల్పజ్ఞుల మూత్రేన్ద్రియ కల్పనను మనము పరిహసింపవలసియున్నది.

అ, ఉ, మ్, అను మూడు అక్షరముల సంయోగముచే ఓం అగుచున్నది. అ=శుద్ధ బ్రహ్మము ఉ=నిశ్శబ్ద ప్రకృతి, మ్=రెండింటి సమ్మిళిత దశ.

లౌకిక (అక్షర) స్వరూపము — అ + ఉ + మ్ = ఓమ్.

వైదిక (మాత్రిక) స్వరూపము । + उ + ं ॐ.

ఉపాస్య రూపము—



పై చిత్రములను చూచిన యెడల, ఓంకారము యొక్క ఉపాస్య స్వరూపమును పాషాణమయముగ తయారొనర్చిన యెడల, అది శివలింగమునకన్న మరేమియు కాజాలదు. 0 అండ స్వరూపమగు అకారము శివలింగము

అనగా బ్రహ్మచిహ్నము. 3 కార స్వరూపమగు

పానువట్టము మాయా ప్రతీకము. బ్రహ్మాండము (బ్రహ్మ యొక్క సాకారస్వరూపము) మాయయొక్క ఆధారము నందు స్థిరమై యున్నది. ఈ వైజ్ఞానిక రహస్యమే పానువట్టమునం దిమిడియున్న శివలింగమునందు తెలియనగును. మకారముయొక్క ప్రతిమయగు త్రిపుండ్రమునందు త్రిగుణీ మాయయొక్క మూడు రేఖలును, మధ్యయందు బిందు స్వరూపమగు బ్రహ్మమును సూచింపబడినవి. అందుచేతనే శివుని ఉపాసించు వారందరును తమ లలాటమునందు త్రిపుండ్రధారణ మొనర్చి, తాము త్రిగుణాతీత బ్రహ్మోపాసకు లగుటను సూచింపుచున్నారు.

భారతదేశమునందు, విశ్వనాథ, పశుపతినాథ, సోమనాథాది దివ్యలింగములు 12 జ్యోతిర్లింగములని పిలువబడు చున్నవి. జ్యోతిర్లింగములు పండ్రెండే యేల ఉండవలయునో దీనిలోని రహస్యము చాలమందికి తెలియదు. బ్రహ్మాండ రూపమగు శివలింగమును తాత్త్విక దృష్టితో విభజించిన యెడల 12 విధములగును. వీనియందే సమస్త చరాచర పదార్థములును ఇమిడియుండును. సాంఖ్యదర్శనము 25 తత్త్వములనియు, వైశేషిక దర్శనము 7 పదార్థములనియు, న్యాయ దర్శనము 16 పదార్థములనియు చెప్పినట్లుగనే శివపురాణము 12 తత్త్వములనే మూలముగా చెప్పి, మిగతావానిని [illegible]

ర్భూతములని చెప్పియున్నది. ఆ 12 జ్యోతిర్లింగముల యొక్క 12 తత్త్వములును ఈక్రింద వ్రాయబడుచున్నవి.

1. బ్రహ్మము, 2. మాయ, 3. జీవుడు, 4. మనస్సు, 5. బుద్ధి, 6. చిత్తము, 7. అహంకారము, 8. ఆకాశము, 9. వాయువు, 10. అగ్ని, 11. జలము, 12. పృథ్వి.

అనగా, బ్రహ్మము, మాయ, జీవుడు, అంతఃకరణ చతుష్టయము, పంచమహాభూతములు — మొత్తము ఈ 12 తత్త్వముల వికాస పరిణామమే సమస్త చరాచరములునై యున్నవని తాత్పర్యము. వేదమునందును "ప్రతిమాస్తై ద్వాదశః" (తైత్తరీయ 1 1.6-7) అని 12 ప్రతిమలు నిర్దేశింపబడియున్నవి.

ఈ 12 తత్త్వములనే మరింత విశదింపజేసిన యెడల 33 అగును. వేదాదిశాస్త్రముల యందివియె 33 దేవతలుగ వ్రాయబడుచున్నవి. ఆవిషయ మిచట అప్రస్తుత మగుటచే వదలివేయుచున్నాను.

కాబట్టి, శివతత్త్వమును గ్రహించి, ప్రతి ఆస్తికుడును శంకరాచార్యుని "అథబ్రహ్మావతారస్య" యను ఛాలెంజిని ప్రపంచమున కంతకును ఉద్ఘోషించి, మానవజాతి నర్థతయు శివభక్తులగా నొనర్పవలయును.

ఓం ఇతిశమ్.

రామా ప్రెస్. (చిత్రటాకీసుపద్ద) శికింద్రాబాదు